

**Some resemblance:** A dried up tree which has acquired an almost human shape on Bagmundi hill in Purulia district.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 8 ఏప్రిల్ 1996 సంచిక 3

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం : కిరాతార్జునీయము – లేపాక్షి

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు: అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

## విజ్ఞాపన

మిసిమిని చదివే మీరు తెలుగు జనాభాలో చాలా కొద్ది మంది మాత్రమే అని మాకు తెలుసు. అయినా మీరు మీగడ తరకలు. వాసిలో మిన్న అయిన మీకే ఈ పత్రిక ఉద్దేశితమైంది. మామూలు జనాభాకు కావలసిన మసాలాలు ఇందులో ఉండవని మిసిమి పాఠకులుగా మీకు బాగాతెలుసు. అందుకే ప్రస్తుతం మిసిమిని చదివే పాఠకులు ప్రయత్నించి మరి కొంత మంది పాఠకులను పెంచవలసిందిగా కోరుతున్నాం.

మరో విషయం రచయితలు - పాతవారు, కొత్తవారు - యధోచితంగా మిసిమి ఒరవడిలో - తమ రచనలను పంపవలసిందిగా అర్థిస్తున్నాము.

ఇంకో విషయం పాఠకుల, విమర్శకుల ప్రతి స్పందన ఏ పత్రిక మనుగడకైన ప్రాణం. అందుకని పాఠకులు, విమర్శకులు మిసిమి పై తమ అభిప్రాయాలను పంపవలసిందిగా కోరుతున్నాము.

సంపాదకులు.

Ever since I came back from prison not once has the defendent ever entered our bed room, while I was awake... I was the loneliest man during the period I stayed with her.

***- Nelson Mandela***

**refering to his wife Winnie**

It is not for the Supreme Court to function as the extended arm of the executive. The judges are not expected to decide questions of political wisdom which virtually involve usurping the functions of the executive

***- Nani A. Palkhiwala***

***Eminent Jurist on the role of Judiciary***

# జ్ఞాన పీఠ సత్కార గ్రహీత

# యం.టి. వాసుదేవన్ నాయర్

సంగ్రహ పరిచయం మధు రాంతకం రాజారామ్

ఒకానొక రాజ్యంలో వాన లొదీస్తాయి, భయంకర క్షామం తాండవిస్తుంది. ఋష్యశృంగుడనే మునికుమారుడు గనుక వచ్చి కాలుమోపితే, దేశంలోని కరువు కాటకాలు పటాపంచలై, జలసమృద్ధితో భూములన్నీ సస్యశ్యామలంగా అలరారు తాయని పెద్దలు రాజు గారికి సలహాయిస్తారు. ఋష్యశృంగుడు విభాండకుడనే ఋషికి ఏకైక పుత్రుడు. స్త్రీద్వేషి అయిన విభాండకుడు కుమారుణ్ణి ఆడ గాలికి దూరంగా ఒక ఏకాంత ద్వీపంలో పెంచుతున్నాడు. రాజుగారి పనుపున రాజవేశ్య కుమార్తె వైశాలి ఋష్యశృంగుణ్ణి తీసుకురావడం కోసం ఏకాంత ద్వీపానికి వెళ్తుంది. తన సంగీత కళాకౌశలంతో, నాట్యవిద్యాచాతుర్యంతో ఋష్యశృంగుణ్ణి మెప్పించి, మైమరపించి తమ రాజ్యానికి తీసుకొస్తుంది. ఋష్యశృంగుడికి పెద్ద ఎత్తున స్వాగతోత్సవం ఏర్పాటవుతుంది. ఇంతలో ఆకాశానమేఘాలు క్రమ్ముకుని, వర్షం గూడా కురవడం ప్రారంభమవుతుంది. మహ ..న సంరంభంలో, కుంభీపాత వర్షంలో ఋష్యశృంగు డెక్కిన రథం పైన, అతడికి చేరువగా వైశాలి కూర్చోవలసిన ఆసనాన్ని రాజకుమారి దురాక్రమణ చేస్తుంది. జన సమూహాన్ని చీల్చుకుని, రథంవైపుగా పరుగెత్తి రావడానికి ప్రయత్నిస్తున్న వైశాలి జనం రద్దీలో క్రింద పడిపోయి, పద ఘట్టనల క్రింద నలిగి, నలిగి చనిపోతుంది. శ్రమ ఒకరిది కాగా, ఫలితాన్ని మరొకరు దోచుకపోయే దురన్యాయం ఈనాటిదా? ఇది అనాది కాలం నుంచీ సమాజ జీవనంలో చాపక్రింది నీరులా వ్యాపిస్తూనే వుంది.

ఈకథ పేరు 'వైశాలి' (అదే పేరుతో సినిమాగా వచ్చింది). రచయిత మలయాళ వారపత్రిక 'మాతృభూమి' సంపాదకులు శ్రీ యం.టి.వాసుదేవన్ గారు. 62 సంవత్సరాల నాయర్ గారు తమ 24వ యేట ప్రచురించిన 'నాలుకట్టు' అనే నవలకు కేరళ సాహిత్య అకాడమి అవార్డు లభించింది. నాటి నుంచి నేటి వరకు ఆయనవి 18 కథా సంపుటాలు, 8 నవలలు, ఒక నాటకం, తదితర రచనలు తొమ్మిది ప్రచురితమయ్యాయి. మంచిని పెంచడం, మానవతకు నివాళి పట్టడం ఆయన రచనల్లో జాలువారే గుణాలు.

దక్షిణాది సంప్రదాయం మేరకు అడ్డ పంచకట్టు, వైన అరచేతుల చొక్కా పై కళ్లద్దాలలో, నుంచి ఎక్కడికో దిగంతాలకు ప్రసరించినట్టుండే చూపులు, చేతివ్రేళ్ల మధ్యకాలే బీడీ, సర్వసామాన్యమైన వేషంతో కానవచ్చే ఈ వ్యక్తి సమకాలీన భారతీయ సాహితీ వేత్తల్లో ఒకరంటే నమ్మడం కష్టమే! నాయర్గా రెంత అమాయకంగా కనిపిస్తారో, అంతటి నిశితమైన దృష్టి కలిగినవారు. సాహిత్య ప్రపంచంలో క్వాలిటీ, పాపులారిటీ అనేవి వేర్వేరుగా వుండవలసిన అవసరంలేదనీ, ఆరెండిటికీ సమన్వయం సాధించవచ్చుననీ నిరూపించిన ప్రముఖ రచయితల్లో ఆయన ఒకరు. అందువల్ల ఆర్థికంగా విజయం పొందడమే ధ్యేయంగా గల 'కథ' నిర్మాతలు గూడా కోసం ఆయన వెంట.పడుతుంటారు. 1973లో కథా రచనతో బాటు, ఆయన దర్శకత్వం గూడా నిర్వహించిన 'నిర్మాల్యం' చిత్రానికి రాష్ట్రపతి స్వర్ణ పథకం లభించింది. 1985లో ఆయన స్క్రీన్ప్లే సమకూర్చిన మరొక చిత్రం మలయాళ సినిమా చరిత్రలోనే సూపర్ హిట్టుగా అనన్య సామాన్యమైన విజయాన్ని సాధించింది.

'ఈనాడు మన సమాజాన్ని ఎదుర్కొంటున్న సమస్యల్ని గురించి ఆలోచించాలన్న ధ్యాస, అక్కర నాలోవున్నాయి. నేను నా రచనల ద్వారా సమాజాన్ని, దేవుణ్ణి, చివరకు నన్ను నేనే ప్రశ్నించుకుంటూ సమాధానాలు పొందాలని అభిలషిస్తూ వుంటాను' అంటారు శ్రీ యం.టి. (అదే కేరళీయులు ఆయన్ను పిలుచుకునే ముద్దు పేరు.)

కథా కథన కౌశలం, సంప్రదాయాన్ని నవసమాజ పరిణామాలకు అనుగుణ్యంగా మలచుకునేతీరు, మానవత్వం పట్ల గల మక్కువ - ఇవి నాయర్ గారికి విశిష్ట స్థానాన్ని సమకూర్చగలిగాయి. స్వాతంత్ర్యానంతర భారతీయ సాహిత్యంలో ఆయన స్థానం సమున్నతమైనది. ఇదివరకే మూడుసార్లు ఆయన పేరు జ్ఞాన పీఠ్ అవార్డు కోసం ప్రతిపాదించబడింది. నాలుగో సారి గూడా బలమైన పోటీలోనేనెగ్గవలసి వచ్చింది. అయితే అడ్డు తగిలిన వారి కన్నా 'జ్ఞానపీఠ్' ఆయన కెప్పుడో వచ్చివుండ వలసిందని భావించిన వారి సంఖ్యే ఎక్కువ.

**(అవార్డు ప్రకటన వెలువడిన సందర్భంలో నాయర్ గారి నివేదన)**

ఒక సాహిత్య కారుడు కొన సాగించవలసివున్న పయనంలో దారిలో ఆదరువుగా, యింకా స్పష్టంగా చెప్పాలంటే దారిలో ఆకలి బాపే చద్ది అన్నపు మూట లాంటివి మాత్రమే ఈ అవార్డులనేవి.

ఒకానొక బహుమతి లభించడం వల్ల ఒక సాహిత్య కృషితో యింక అవసరం లేదనిగానీ, లేదా దానికి ఫుల్‌స్టాప్ పెట్టబడిందని గానీ ఎవ్వరూ అనుకోరు; అనుకోగూడదు. పాఠకుల అంగీకారంలాగా, అమోదంలాగా ఈ అవార్డులు గూడా సాహిత్య కారుణ్ణి వెతుక్కుంటూ వస్తున్నాయి. రచనకు పూర్వరంగంలో దాన్ని ఎందరు చదువుతారనిగానీ, చదివినవారిలో ఎందరి కది ఆమోద ప్రద మవుతుందని గానీ రచయిత ఆలోచించడు. అయితే ఆమోదం, ఆదరం, అభిమానం లాంటి వన్నీ వాటంతటవే కాలక్రమంలో అతణ్ణి వరిస్తూ వుంటాయి. బహుమతులు గూడా ఆ దోవలోనివే!

సాహిత్య సృష్టి అనే వృత్తి మిగిలిన వృత్తుల కన్నా విభిన్నమైనది. అకాడెమీ ద్వారా జరిగే పరిచయ సన్నివేశాలుగానీ, అవి యిచ్చే యోగ్యతా పత్రాలుగానీ దానికేమీ అవశ్యకమైనవిగావు. తానొక సాహిత్య స్రష్టగా రూపొందాలన్న ఆకాంక్ష ఒకటి రచయిత కుంటే చాలు.

' ఇదిగో, ఇక్కడుండి నేను రచనలు చేస్తున్నాను, గమనించండి, అవధరించండి' అనే కోరిక లేదా ప్రార్థన సాహిత్య వ్యాసంగంలోకి దిగిన తొలిదశలో రచయిత కుంటే వుండవచ్చు, ఆ కోరిక నేరవేరి తాను లబ్ధ ప్రతిష్ఠుడైన తర్వాత, తానుచేసే ఒక్కొక్క రచనా విలువల త్రాసులో తూచీబడి అందులోని సందేశం సమాజ.శ్రేయస్సుకు ఎంత వరకు తోడ్పడుతుందన్న తర్కవితర్కాలకు పాత్ర మవుతుందని అతడు గుర్తించాలి.

మొత్తానికి ఒక సాహిత్యకారుడు ఎన్నుకోదగిన దారి లేదా చేయవలసిన యాత్ర ఏమంత సుకరమైనవి గావు. రాళ్లు, రప్పలూ - ముండ్లూ ముట్రా నిండిన అడవి దారి గుండా ఒక సుదీర్ఘమైన, శ్రమావహమైన తీర్థయాత్ర లాంటిది. ఎన్నెన్ని అవరోధాలైనా ఎదురుకావచ్చు, ఎన్నెన్ని సమస్యలైనా పరీక్షించవచ్చు, కానీ వాటి నే మాత్రం సరకు చేయకుండా రచయిత ముందుకు, మున్ముందుకు సాగిపోవలసి వుంటుంది.

పంచామృతాలు:

# పోస్టుమేన్, మరియు తెలుగు కుక్కలు

– పురాణం సుబ్రహ్మణ్యశర్మ

ఇదేదో వ్యంగ్యంగా అన్యాపదేశంగా అన్నమాటకాదు. అచ్చంగా అవి కుక్కలే. తెలుగువారివి కనుక తెలుగు కుక్కలు నాబరుగు. ఒక కుక్క పూర్వం చాకలి వద్ద గాడిదలా ఓండ్ర పెట్టి, కాదు కాదు, గాడిద కుక్కకు బదులుగా ఓండ్ర పెట్టి యజమానికి నిద్రాభంగం చేసి చావు దెబ్బలు తిన్నది. పరాధికారము పైనపెట్టుకొన్న వాడు ఓండ్రపెట్టిన గాడిదవలె ఆపదపాలగును అన్నది నీతి చంద్రిక. ఈ కథ సాంఘిక సేవలకు వ్యతిరేకం. ప్రపంచంలో యీనీతిని ఫాలో అయితే సోషల్ నక్కనిలచిపోవును.

కుక్కలు మన సామాజిక వ్యవస్థలో పోస్టు మెన్‌ల కంటె పాతవి. దొంగలు కుక్కలను మచ్చిక చేసుకొనడానికి విషం కలిపిన ఆహారం వగైరాలు తీసుకపోతూవుంటారు. కుక్కలలో రెండు రకాలు వున్నాయి. వీధి కుక్కలు అరుస్తాయిగాని కరవ్వు, కరిచే కుక్క అరవదని అంటారు గాని ఆ సంగతి కుక్కల స్వవిషయం. మన కెలా తెలుస్తుంది.

పోస్టుమేన్ ఎందరిళ్ళకో వెళ్ళి ఉత్తరా లివ్వాలి. అందరిళ్ళలోని కుక్కలు వాడ్ని కరిస్తే యిక మిగలడు. పోస్టుమేన్ వ్యవస్థే అడుగంటిపోతుంది. కాని యిళ్ళ యజమానులు|కుక్కవున్నది జాగ్రత్త అని ఓ బోర్డురాయించి తృప్తి పడుతున్నారు. కుక్కలు తెలుగు చదవలేవు అన్న యింగిత జ్ఞానం కూడా కుక్కలు కలవారికి వుండదు గదా! ఈ ప్రపంచకంలో కుక్కలు కలవారు లేనివారు అని రెండే జాతులు. ఒకటి కరిచేవి, రెండో వారు కరవబడేవారని గుర్తించాలి. పోస్టుమేన్‌లను కరవకుండా పట్టణాలలో యింటి ముందు ఎర్రటి ఉత్తరాల డొక్కులు అమర్చుకుంటారు కొందరు ఘటాలు. అలా ఉత్తరాల డొక్కపెట్టెలు అమర్చుకోని వారు పోస్టుమేన్ బెల్లు కొట్టి ఉత్తరాలు యింట్లో యిచ్చి పోవాలనుకుంటారు. ఇక్కడ ఒక మంచి లవ్‌స్టోరీ గుర్తుకు వస్తోంది. ఒక ప్రియురాలికి దూరదేశం నుంచి ప్రియుడు లవ్‌లెటర్సు రెగ్యులర్‌గా బనాయిస్తున్నాడు. రోజూ ఆవీధి పోస్టుమేన్ ఆప్రేమ లేఖని జాగ్రత్తగా ఆ అమ్మడుకియిచ్చి, ఓ నవ్వునవ్వి వెళ్తున్నాడు. ఆ అమ్మాయి ఎదురుచూసి చూసి ఆ ప్రియుడు ఎంతకీ రాకపోగా చివరకు ఆపోస్టుమేన్నే ప్రేమించి పెళ్ళాడేసిందట.

కాళిదాసు మేఘుడి లాటి సందేశహరుడు కాలేకపోయినా పోస్టుమేన్ నిజమైన సందేశహరుడే! తాను చేరవేసే శుభాశుభాల మిశ్రమంతో ఆతని కేమీ జోక్యంలేదు. కాలేజీ కుర్రవాళ్ళు మని యార్డర్లు తెచ్చే పోస్టుమేన్‌ను ప్రేమిస్తారు. పోస్టుమేన్లకు సైకిలు వున్నా యింటింటికీ తిరిగే వుద్యోగం కనుక అది ఆట్టేలాయకీకాదు. పోస్టుమేన్లు ఎవరితో తగూ పెట్టుకోడ ఎవరూ పోస్టుమేన్‌తో తగూకిదిగరు. పోస్టుమేన్లు ఉత్తరాలు చదివి పెడుతూ వుంటారు. కాని కొంద రిళ్ళలోవుండే కుక్కలకు పోస్టుమేన్‌ల గురించి ఏం తెలుసు? కొందరు అల్సేషియన్లు, డాబర్ మేన్‌లు పెంచుతూ వుంటారు. కుక్కకాటుకి చెప్పుదెబ్బ అన్నారుగాని కుక్కకరిస్తే బొడ్డు చుట్టూ ఇంజక్షన్లు పొడుస్తారు. కుక్కల్లో పిచ్చికుక్కలున్నాయి. అవి కరిస్తే మనికి చాలా కష్టం. కొందరు గొప్పవారు కుక్కల్ని తమ పెరట్లో స్వేచ్ఛగా వదిలేస్తూ వుంటారు. అవి యింటికి ఎవరు వచ్చినా వారి మీదకు ఎగబడుతూ వుంటాయి. పూర్వం మన సమాజంలో బ్రాహ్మ లెవ్వరూ కుక్కల్ని పెంచేవారు కాదు. శ్రాద్ధ భోజనం పూర్తయాక ఆ ఎంగిలి విస్తళ్ళు సైతం కుక్కలు ముట్టు కోకుండా చూడాలి. పూర్వం చండిక అనే ఇల్లాలి కథ ఓటి వుంది. ఆవిడ అన్నీ వ్యతిరేకపు మాటలు వ్యతిరేకపు పనులు చేసి భర్తను

ఏడిపించుకుని తినేది. తన తల్లి ఆబ్దీకానికి అన్నీ వ్యతిరేకంగా మాట్లాడి కొసదాకా పనులు ఆవిడ చేత సలక్షణంగా చేయించుకున్న యజమాని చివరలో "పిండాల్ని పితృదేవతలకు పెట్టు" అనగా ఆవిడ అందుకు వ్యతిరేకంగా పిండాల్ని కుక్కలకు పెట్టడంతో పితృకార్యం అంతా వ్యర్థమైపోతుంది. కుక్కల్ని పెంచడం మంచి కార్యం కాదు.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు "మాక్షే దుర్గంలతో కుక్క' అని ఓ మంచికథ కుక్కల మీద అల్లారు. రావి శాస్త్రి గారు కూడా "బాకీ కథల్లో' కుక్కపిల్ల మీద చక్కని కథ అల్లారు. అంతా ఎదురు చూసేది పోస్టుమేన్ కోసమే! తంతి తపాలా శాఖ వారి బంట్రోతును టెలిగ్రాఫ్ ప్యూను అని అంటారు. క్రాని యితను వస్తే శుభమో, అశుభమో అని జనం కంగారు పడటం ఖాయం.

కుక్కల్లో భాషాభేదా లున్నాయెూ అని కొంతమంది సందేహ పడవచ్చు, ఉత్తర హిందూస్థానంలోని కుక్కలు రాష్ట్ర భాషలో కాని పలకవు. తెలుగు కుక్క లనేవి తెలుగు నేత యన్.టి. ఆర్ గారు వచ్చాక బలంపుంజుకుని తోకెత్తుకుని తిరుగుతున్నాయి. సుమతీ శతకంలోని 'కనకపు సింహాసనమున' అనేపద్యం శునక స్వభావం మీద చాలాడామేజింగ్ గా రాసినది. శునక ప్రియులు సహించదగినది కాదు. పిచ్చికుక్కల గురించి చక్కని వ్యాసం రాశాడు ఛార్లెస్ లాంబ్, కుక్కల బండి అని వీధి కుక్కలను పట్టుకుని ఓ బండిలో వేసి మున్సిపాలిటీ వాళ్ళు కుక్కల్ని హతమారుస్తూ వుంటారు. వీధి కుక్కలు మొరిగినపుడల్లా కొత్తవాళ్లకు అవి మీదబడి ఎక్కడ కరుస్తాయో అని భయపడటం కద్దు వీటిని మనవాళ్ళు గ్రామసింహాలని అంటారు. ఒక పెద్ద మనిషి గ్రామంలోని మునసబు, కరణాల్ని అదేదో గొప్ప పదమనుకుని 'మన గ్రామసింహాల'ని సంబోధించాడట. కుక్కలు 'బొక్కలు' వెదకును అన్నారు. బొక్కలు అంటే ఎముకలని అర్థం.

కొత్త పోస్టుమేన్లకు కుక్కల బెడద తప్పనిసరి. కుక్కలు పోస్టుమేన్ని పరిగెత్తించగలవు. అయితే వీటిలో ఐకమత్యం తక్కువ . కుక్కకి తినడాని ఏదన్నా దొరికితే మరో కుక్క అక్కడకు రాకుండా జాగ్రత్త పడి మొరుగుతుంది. తెలుగు కుక్కలని రిఫర్ చెయ్యడం చాలా సహజంగావుంటుంది. కుక్కలకి మెడ, చుట్టూ పటకాలు, గొలుసులు, పక్క, తినడానికి బొచ్చె ఒక డాగ్ హౌస్ వుంటాయి. డాగ్ హౌస్ని కెన్నెల్ అని కాబోలు అంటారు. కుక్క మనిషిని కరిస్తే వార్తకాదు. మనిషి కుక్కను కరిస్తేవార్త అవుతుందని జర్నలిజం పుస్తకంలో రాస్తారు. కుక్క పోస్టుమేన్ని కరిస్తే వార్త అవదు. పోస్టుమేన్ కుక్కని కరవాలి అంటారు జర్నలిస్టులు. పోస్టుమేన్ని కుక్కకరిస్తే మాత్రం డామేజి యివ్వవలసి వుంటుంది. కన్యాశుల్కం బ్రాహ్మల్ని గురించిన నాటకం గనుక అందులో కుక్కలకు ప్రవేశం లేదు. రాత్రి వేళల్లో కొన్ని కుక్కలు మోరలెత్తి కోరస్గా భయంకరంగా ఏడుస్తాయి. వాటికి ప్రేతాత్మలు కనిపిస్తాయని అంటారు. రైళ్ళలో డాగ్ 'బాక్స్' అని వుంటుంది. కుక్కల్ని అందులో చేర్చి ప్రయాణం చేయిస్తారు గార్డులు. ఈ డాగ్ ' బాక్సుల్లో కుక్కలు మారుతూవుంటాయి. రైళ్ళలో కుక్కలు ప్రయాణం చెయ్యడానికి వీలుకాదు. ఆడవాళ్ళు ముద్దు చేసే పిక్నీసు వంటి కుక్కల్ని 'లేపడాగ్స్' అంటారు. దొరసానిగార్ని మచ్చిక చేసుకోవాలంటే ముందామెగారి కుక్కగారితో స్నేహం చెయ్యాలి. కుక్కలు బీచిల్లో సముద్రంలో బంతాట ఆడు కుంటాయి.

సినీమాల్లో, నాటకాల్లో "పోస్ట్' అనే పోస్టుమేన్ పాత్ర లేకుండా కథ నడవదు. కుక్కలు పోస్టుమేన్ను తరిమి అతని దుస్తుల్ని చింపడం వరకూ వస్తే డామేజి తప్పదు. నిత్యం కుక్కలతో రిస్కునపడే పోస్టుమేన్ గురించి అతని భార్య ఏమంటుందో?

# శర్మిష్ఠ

మూలం: జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఖండేకర్ సమీక్షకుడు : ఎస్. సదాశివ

''పద్దెనిమిది సంవత్సరాల తరువాత మళ్లీ హస్తినాపురం వెళుతున్నాను. వచ్చిన బాట వెంటనే. అలాగే భయంతో. ఈ బాటకు ఇరువైపులా వున్న వృక్షాలు అలాగే వున్నాయి. అక్కడక్కడ దేవాలయ గోపురాలు అలాగే వున్నాయి. పద్దెనిమిదేళ్ల కిందటి శర్మిష్ఠనేనేను. కాని అప్పటి పరిస్థితి వేరు. ఇప్పటి పరిస్థితి వేరు. అప్పటి శర్మిష్ఠ ఒక చంటివాని తల్లి. ఒక మహారాజు భార్య. ప్రేయసి. కాని, నేటి శర్మిష్ఠ కేవలం తల్లిగానే మిగిలింది. నాకొడుకు పూరుడు సురక్షితంగా క్షేమంగా వున్నాడు గదా అన్న ఆందోళన తప్ప ఒకటే భయం. నా కొడుకు దస్యులను జయించిన యదు వెంట హస్తినాపురం వెళ్ళివుండడు గదా? వెళ్తే దేవయాని వాణ్ణి మహారాజు పుత్రుడని గుర్తించదు గదా! తండ్రిపోలికలే వానివి. ఒక వేళ దేవయాని గుర్తిస్తే?

నావెంట సంరక్షకు లున్నారు. వాళ్లు కాక ఈ సువర్ణ కేశాల అమ్మాయి అలక కూడా వున్నది. అందమైన ఈ అమాయిక బాలికకు నా పూరుని మీద అంతులేని ప్రేమ. తల్లి వద్దంటున్నా వినక నా వెంబడిపడి వస్తున్నది.

ఇక్కడ శర్మిష్ఠ పద్దెనిమిది సంవత్సరాల కిందట రాత్రి మహారాజు సహాయంతో దేవయాని చెరనుంచి తప్పించుకొని బయటపడి ఎన్నెన్ని కష్టాలు పడ్డదో చెప్తుంది. చంటి కొడుకు నెత్తుకొని కాలినడకన ఎంతదూరం నడిచిందో, ఎన్ని వాగులూ, వంకలూ, కొండలూ, కోనలూ దాటిందో ఎన్నెన్ని పల్లెలూ, బస్తీలు దాటిందో చెప్తుంది. అప్పటికే దేవయాని ''హస్తినాపుర రాజప్రాసాదం నుంచి ఒక దాసి చంటి పిల్లవాణ్ణెత్తుకొని పారిపోయింది. ఆచూకి చెప్పిన వాళ్లకు బహుమతి. పట్టిచ్చిన వాళ్లకు ఇంకా పెద్ద బహుమతి.'' అని దేశమంతటా చాటింపు వేయించింది. రాత్రుళ్లు ఏ గుడిలోనో, ఏ పాడుబడిన ఇంటిలోనో గడిపేది. కుగ్రామాల్లో కొంద రామెకు అన్నంబెట్టి ఆదరించారు. కొందరు అవమానించి పంపారు. కొందరు అనుమానంగా చూశారు. పెద్ద బస్తీల్లో ఆమె చిత్రంతో కూడుకొన్న చాటింపు పత్రాలు గోడకు అతికించబడి కనిపించాయి. బస్తీలను తప్పించుకుంటూ బహుదూరం ప్రయాణం చేసింది. హిమాలయ సానువుల వరకు వెళ్లింది. ఒక కొండమీంచి లోయలో పడిపోయేదే. లోయకు ఆవలివైపు నుంచి '' ఆగు, ఆగు,'' అనే ఎవరిదో కర్కశమైన స్వరం వినిపించింది. ఆగిపోయింది. ఆగుమని అరచిన వ్యక్తి అడ్డదారిన ఆమెను సమీపించాడు. వెన్నెల రాత్రి. అతడు జటాజూటాలు, గడ్డం, మీసాలు గల ఒక ఋషి. ఆమెవైపు చాలాసేపు పరకాయించి చూశాడు. ఆమె గుర్తించింది. అతడు యతి. ఒక్కక్షణం ఆమె శరీరం భయంతో జలదరించింది. భయాలకు అతీతమైన బ్రతు కామె దిప్పుడు. కాబట్టి ధైర్యం చిక్కబట్టుకొని అతని కళ్లలోకి సూటిగా చూసింది. అతనివి వెనుకటి వెర్రి చూపులు కావు. స్నేహస్నిగ్ధమైన చల్లని చూపులు. అతడూ గుర్తుపట్టాడు.

''శర్మిష్ఠ్హే! నువ్విక్కడి కెలా వచ్చావు? ఎందుకొచ్చావు?'' అని ప్రశ్నించాడు. ''రావాలనే వచ్చా నిక్కడికి. నా భుజం మీదున్న వీణ్ణి వీని పెదతండ్రికి చూపించాలని వచ్చాను.'' అన్నది. యదు ఆనందంతో ఆ బాలుణ్ణి ఎత్తకొని ''వీడు నా తమ్ముని కొడుకా? యయాతి కొడుకా? వీడొక ముద్దిస్తాడను కొంటే నిదుర పోతున్నాడు. సరే పద.'' అని ఆమెనొక పర్ణకుటీరానికి తీసుకవెళ్లాడు. అంగిరస మహర్షి శిష్యుల పర్ణకుటీరాలు ఆ ప్రాంతంలో చాలా చోట్ల వున్నాయి. అలాటి ఒక కుటీరంలో వుంటున్నాడు యయాతి. పూరున్ని కుటీరంలో సుఖంగా పడుకోబెట్టి యతి సమర్పించిన పళ్లు తిని కాస్త సేదదీరింది శర్మిష్ఠ. తరువాత వాళ్లిద్దరు పర్ణకుటి బయట బండల మీద కూర్చుని తమ తమ కథలు చెప్పుకున్నారు. అంగిరసుని శిష్యు లెవరో యతిని బలవంతంగా భృగు పర్వతం మీది కచుని దగ్గరికి చేర్చారు. అక్కడ రాజమాత కనబరచిన అసమానమైన మాతృప్రేమ వలన, కచుని స్నేహపూరితమైన హితవచనాల వలన యతిలో చాలా మార్పు వచ్చింది. ఈ సంగతి యతే శర్మిష్ఠకు చెప్పుకున్నాడు. ''వహినీ! (వదినె. మహారాష్ట్రులు, ముఖ్యంగా కోంకణ ప్రాంతం వాళ్లు తమ్ముని భార్యను గూడా వదినె అంటారు. ఖాండేకర్ కోంకణ ప్రాంతం వాడే.) అంగిరస మహర్షి ఆశ్రమంలో ఋషి కుమారులు మాట్లాడుకునే మాటలు విన్నాను. మా తండ్రి నహుషునికి కలిగిన శాప వృత్తాంతం తెలుసుకున్నాను. సుఖంలేని సంసారంలో వుండే కంటె శాశ్వత సుఖాన్నిచ్చే పరతత్త్వ అన్వేషణే మేలని అడవుల్లో పడ్డాను. ఒక స్త్రీ కారణంగా, అంటే ఇంద్రాణి కారణంగా నా తండ్రి శాపగ్రస్తుడైనాడు కనుక ప్రపంచంలో స్త్రీ జాతి లేకుండా చేయాలని సంకల్పించాను. తెలివి లేని సంకల్పం. గురువులేని సాధన. మానవ సమాజానికి దూరంగావుండి ఏవేవో సిద్ధులు పొందాను. కాని అవన్నీ పనికి మాలినవి. మానవ మృగంగా మారాను. కచుడు నా ఆలోచనలో సంతులనం కలిగించాడు. నా సాధనలను సవ్యమార్గం పట్టించాడు.'' అని చెప్పుకున్నాడు యతి.

శర్మిష్ఠకు ఊరట కలిగింది. ఒక ఆశ్రయం లభించింది. జీవిత మంతా కష్టాలను భరించిన బావగారికి సేవజేసే అవకాశం గూడా లభించిందని భావించింది. ఆ మాటే యతికి చెప్పింది. అతడు నవ్వి '' అది సంభవం కాదమ్మా వదినె! నేనిక్కడ వుండను. శుక్రాచార్యుడు సాధించిన దానికంటె గొప్పశక్తిని సాధించడానికి కచుడు దీర్ఘ తపస్సు ప్రారంభించనున్నాడు. అతడు సాధించేది విశ్వశాంతి. కాబట్టి నేను భృగు పర్వతానికి వెళ్లాలె. నా మంత్ర సిద్ధులకు ముగ్ధులై నాకోసం ప్రాణాలర్పించే ఆటవికులు ఈ పర్వత సానువుల్లో అనేకు లున్నారు. వాళ్ళు నిన్నుదేవతగా ఆరాధిస్తారు. నీ కొడుక్కు యుద్ధ విద్య లన్నీనేర్పుతారు.'' అన్నాడు. మర్నాడు యతి అన్న మాట ప్రకారం శర్మిష్ఠను, ఆమె కొడుకును ఆటవికుల గ్రామంలో వదిలిపెట్టి, భృగు పర్వతానికి వెళ్లిపోయాడు. పూరుడు దినదిన ప్రవర్ధమానుడై తండ్రిలాంటి సుందరమైన సుదృఢమైన అంగసౌష్ఠవాన్ని సంతరించుకున్నాడు. అక్కడే అలక తల్లి పరిచయమయింది. అలక పినతల్లి కొంతకాలం హస్తినాపుర రాజప్రాసాదంలో దాసిగా పనిచేసింది. అక్కడే మరణించింది. ఆ పిల్ల చిన్నప్పటి నుంచి శర్మిష్ఠ దగ్గరే పెరిగింది. పదహారేళ్ల వాడైన తరువాత పూరుడు తన తండ్రి ఎవరో చెప్పమని తల్లిని వేధించసాగాడు. శర్మిష్ఠ జరిగినదంతా కొడుక్కు చెప్పింది. పూరుడు పద్దెనిమిదేళ్ల వాడయ్యాడు.

ఒకరాత్రి ఎక్కడికో వెళ్లిపోయాడు. తల్లికి ఈయవలసిందిగా చెప్పి అలకచేతి కొక పత్రం ఇచ్చి వెళ్లాడు.

''అమ్మా! హస్తినాపురం రాజ్యం మీద దస్యులు దండయాత్ర చేశారని తెలిసింది. రాజ్యాన్ని రక్షించుకునే బాధ్యత నాకు కూడా వున్నది గదా! వెళుతున్నాను. విజయం సాధించి మళ్లీ నీ పాదాల చెంతకు వస్తాను. నాకోసం ప్రాణాలర్పించే వీరులైన మిత్రులు నావెంట వున్నారు. నువ్వేమీ దిగులు పడకు.'' అని వున్నదా పత్రంలో. దాన్ని చదివి శర్మిష్ఠ ఏడిచింది. అలక ఏడిచింది. ఆటవిక స్త్రీలు ఏడ్చారు. కాని పౌరుషవంతులైన ఆటవికులు కొందరు అక్కడుండి ఏడిచేకంటె హస్తినాపురం దగ్గర్లో ఏదైనా గ్రామంలో వుండి యుద్ధ వార్తలు ఎప్పటి కప్పుడు తెలుసుకుంటూ వుండవచ్చునని నచ్చచెప్పి బలవంతులైన అంగరక్షకుల వెంట ఆమెను పంపివేశారు. అలక గూడా ఆమె వెంట బయలు దేరింది. హస్తినకు ఆరుకోసుల దూరాన గల ఒక గ్రామంలో నివసిస్తూ వాళ్లు యుద్ధ వార్తలు తెలుసుకుంటూవున్నారు. యదును, అతని అనుచరులు కొందరిని దస్యులు బంధించి తీసుక వెళ్లిన వార్త తెలిసింది. వారిలో తన పూరుడు గూడా వున్నాడేమో అనే ఆందోళన శర్మిష్ఠకు కలిగింది.

# దేవయాని

'' రాత్రి ఎంత భయంకరంగా వున్నది! అంతటా నిశ్శబ్దం. దూత వచ్చి ఆ అశుభవార్త చెప్పినప్పటి నుంచి నా చుట్టూ అగ్నిజ్వాలలున్నట్టూ, నే నెటూ తప్పించుకుపోలేని స్థితిలోవున్నట్లూ అనిపిస్తున్నది. ఎంతటి దారుణమైన వార్త! యువరాజు యదు పరాభూతుడై దస్యుల చేతికి బందీగా చిక్కారట! నా యదు హస్తినకు మహారాణినైన నా కుమారుడు, త్రిలోకారాధ్యుడైన శుక్రాచార్యుల మనుమడు-పరాక్రమ వంతుడు-యుద్ధానికి వెళ్లేటప్పుడు ఎంత ఉత్సాహంగా విజయ తిలకం దిద్ది పంపాను! అంతటి ఉత్కంఠతో వాని విజయవార్త వినాలనీ ఎదురు చూస్తున్నాను! అంతా అసత్య మనిపిస్తుంది. నా కొడుకు ఓడిపోవట మేమిటి?

దేవయాని ఎవరికీ తల వంచలేదు. ఇప్పు డెవరి ముందు తలవంచి నా కొడుకును విడిపించ వలసిందిగా వేడుకోను? నా తండ్రి తప స్సింకా పూర్తికాలేదు. ఈ పద్దెనిమిదేళ్లు ఎంతటి దు:ఖాన్ని నాలో నేను దాచుకున్నాను! అయినా నా తండ్రి దగ్గరికి వెళ్లానా? కోపిష్ఠి. ముందు వెనుకలు ఆలోచించేవాడు కాదు. నే నతని దగ్గరికి వెళ్తే అర్ధంతరంగా తపస్సుచాలించి నా వెంట వస్తాడు. కాని వెళ్లను. ఇప్పటికే నావలన చాల నష్టపడ్డాడు. సంజీవని విద్యను నా కారణంగానే పోగొట్టుకున్నాడు. ఇన్నేళ్ల తపస్సుసిద్ధించకముందే నాకారణంగా వదిలి పెట్టేట్లుచేయను. అతని తపస్సు సిద్ధించేవరకు నా యదు ఏమైపోతాడో? ఎప్పుడు క్షేమంగా తిరిగి వస్తాడో వాడు? ఎప్పుడు వాని శిరస్సును నా అశ్రువులతో అభిషేకించ గలుగుతానో? నా యదు నాకు దొరికితేచాలు. ఈ రాజ్యం వద్దు- నా తండ్రి తపస్సిద్ధితో నాకు పని లేదు.

ఇవి దేవయాని మాటలా? ఒక తల్లి మాట లివి. నేను కేవలం తల్లినేనా? శుక్రాచార్యుని పుత్రికను - హస్తినాపురమహారాణిని - నా మన స్సింత దుర్బలం కాగూడదు. ఏమి చేయాలో తోచటం లేదు. యదు నెలా విడిపించాలె? ఎవరు విడిపిస్తారు? మహారాజు గుర్తుకు వచ్చాడు. అతడూ ఒక కాలంలో మహాపరాక్రమ వంతుడే కదా. ఈ వార్త తెలిస్తే తన కొడుకును విడిపించుకో కుండా వుండగలడా? యదు నా ఒకర్తె కొడుకా?

మహారాజు ఇంకారాడేమి?. నన్ను ఓదార్చి తన పరాక్రమంతో యదును విడిపిస్తానని చెప్ప డేమిటి? ఇంకా అతనికీ వార్త తెలియ లేదా యేమిటి? ఈ వార్త వినిపిస్తానని రెండు గడియలముందే అమాత్యుడు అశోక వనం వెళ్లాడు గదా?, మహారాజు ఇంకా మదిరా, మదిరాక్షుల వ్యామోహంలోనే వున్నాడా? కర్తవ్య జ్ఞానం కలుగదా అతనికి?

పద్దెనిమిదేళ్లు! పద్దెనిమిదేళ్ల క్రిందట, వర్షం కురుస్తున్న రాత్రి నా నృత్యకళకు మహాజనులే కాక మహామహా కళాకారులుగూడ ఎంతగా ముగ్ధులయ్యారు? గొప్పగా నాట్యం చేశాను. నా దుఃఖాన్ని, రాగద్వేషాలను, నా అస్తిత్వాన్ని మరిచి పోయి నాట్యం చేశాను. విషాదంలోనే కళ వికసిస్తుందేమో? సామాజికులు నా నృత్యాన్నే చూశారు కాని, అప్పుడు నా మనస్సు ఎంతగా గాయపడి వుండెనో, ఎంతగా నెత్తురోడుతూ వుండెనో వాళ్లకేమి తెలుసు? నా భర్తే నా మనస్సును గాయపరిచాడు. ముక్కలు చేశాడు. నమ్మిన భార్యను ఏ భర్త మోసగించగూడని విధంగా మోసగించాడు. అతనికీ, శర్మిష్ఠకూ గల ప్రణయ సంబంధం వెల్లడయింది. పూరుని చేతిలో చక్రవర్తి కాగల రేఖ లున్నాయట. ఉండనీ! ఆ రేఖ లుండవిక. ఆ చేయే వుండదు. వాని తల్లీ వుండదు.

దేవయాని శర్మిష్ఠ పారిపోయిన నాడు అక్కడి వృద్ధ దాసిని కొరడాతో కొట్టి కొట్టి నిజం పలికించింది. ఆ వృద్ధ దాసి మహారాజు లోనికి వెళ్లటం చూచింది కాని బయటికి రావటం చూడలేదు. ఆ సంగతి జ్వరగ్రస్తుడైన మాధవుణ్ణి పరామర్శించటానికి వాళ్లింటికి వెళ్లినప్పుడు తెలిసింది. మాధవుని కాబోయే భార్య మాధవి ఏడుస్తూ చెప్పింది. కాని శర్మిష్ఠ నెక్కడ దాచారో తెలియ లేదు. అపస్మారక స్థితిలో మాధవుడు "మహారాణీ! జాగ్రత్త. ఇది మహారాజు గారి ఆజ్ఞ." అని పలువరించటం విన్నది. మహారాజూ, మాధవుడూ తన స్థానంలో శర్మిష్ఠను మహారాణిగా భావిస్తున్నారని గ్రహించింది. ఆ రాత్రి తన ప్రవర్తన సరైంది కాదేమో అని కాసేపు ఆలోచించింది. కాని అందులో తన తప్పులేదని తనను తాను సమర్థించుకున్నది. ఎలా సహించగలదు? తానిచ్చిన మాట తప్పి వొళ్లు తెలియనంతగా మద్యపానం చేసి కామంతో తన మీది మీదికి వస్తుంటే అతన్నెలా సహించగలదు? తాను సామాన్యస్త్రీ కాదాయె - శుక్రాచార్యుని కూతురు. యువరాజు యదు తల్లి. హస్తినాపుర మహారాణి. ఎలాసహించగలదు?

అతడొక్క మాటన్నాడా? '' నా శర్మిష్ఠను నువ్వే యేమో చేశావు. రాక్షసీ! నీకు హృదయం లేదు. నాకు నువ్వు కావాలె. శర్మిష్ఠ కావాలె. ఇంద్రాణికావాలె.'' అని వదురుతూ మీది మీదికి

వస్తుంటే, "అక్కడే ఆగండి. నేను శుక్రాచార్యుని కుమార్తెనన్న సంగతి మరిచిపోకండి. నా తండ్రి శపిస్తే మీరొక శిలాఖండం కాగలరు. ఏదో వొక జంతువు కాగలరు. నా తండ్రి మీద వొట్టేసి చెప్పండి- ఇంకెప్పుడూ ఇక్కడికి రారు. నన్నెన్న డూ తాకరు.'' అని శాసించింది. శాపం ప్రసక్తి రాగానే యయాతి మత్తు దిగిపోయింది.''రాను - ఎన్నడూ నిన్నుతాకను.'' అని శపథం చేసి వెళ్లి పోయాడు.

తనను తానెంత సమర్థించుకున్నా తనలోని స్త్రీ ఎప్పుడూ పొడుస్తూ వుంటుంది. ''దేవయానీ! తప్పుచేశావు. భార్యగా నీ కర్తవ్యాన్ని పాలించలేదు'' అంటూ.

అమాత్యుడు తల వంచుకొని వచ్చాడు. యదును దస్యులు బంధించి పట్టుకు వెళ్లినారని చెప్తే మహారాజు మద్యపాత్రను ఖాళీచేస్తూ '' వెళ్లనీ - దేవయానిని కూడా బంధించుకు వెళ్తే నాకు చింతలేదు.'' అన్నాడని విన్నవించాడు. శాప భయగ్రస్తుడైన యాయాతి అలా మాట్లా[illegible]ని దేవయాని ఆశించలేదు. తన తండ్రి తపస్సు ముగిసిన తర్వాత మహారాజు నెలా సాధి[illegible]తో తనకు తెలుసు.

అంతలోనే ఒకదూత వేగంగా వచ్చి శుభవార్త చెప్పాడు. యువరాజు వయసు గల ఒక వీరయువకుడు ప్రాణాలకు తెగించి దస్యులతో పోరాడి ఓడించి, యువరాజును బంధముక్తుని చేసి అతని వెంట హస్తినకు వస్తున్నాడు. పదిహేను రోజుల్లో చేరుకోగలరు వాళ్లు.

ఇంకో దూత వృషపర్వ మహారాజు పంపినవాడు. అతడూ శుభవార్తే తెచ్చాడు. శుక్రాచార్యుల తపస్సు సిద్ధించింది. కూతురును చూడటానికి పదిహేను రోజుల్లో వస్తున్నా డతడు.

ఏక కాలంలో రెండు శుభవార్తలు. తన తండ్రి చేత తనకొడుక్కు పట్టాభిషేకం జరిపించాలె - దేవయాని ఆనందానికి హద్దులు లేవు.

# Truth is beauty

*Of all the great Romantics, Rabindranath felt most comfortable with Keats and his aesthetics of pleasure is derived largely through Keats's notion of joy that comes from an awarness of suffering, writes Ujjal Kumar Majumdar*

# వ్యంగ్య సాహితీ సార్వభౌముడు - స్విఫ్ట్

–రాజేంద్రకుమార్ దేవరపల్లి

'' పసిపిల్లల్ని ఏడాదిన్నర వయసు వచ్చేవరకూ వాణిజ్య పంటలా పెంచితే, ఆ తర్వాత ఆంగ్లేయులు వారిని ఏ విధంగా వండుకుతిన్నా మహారుచిగా ఉంటుంది. తద్వారా తల్లిదండ్రులకు బెడదా తప్పుతుంది, ఇంగ్లీషువారి జిహ్వా చాపల్యం తీరినట్టూ ఉంటుంది.'' ఎంత దారుణమయిన మాటలు! ప్రాణ మొక ఎత్తుగా చూసుకునే పిల్లల్ని వాణిజ్యపంటలా పెంచటమేమిటి? వండుకు తినడ మేమిటి? బతికినంత కాలం ఇలాంటి రాతలే రాసి, బ్రిటీషువారికి కొరకరాని కొయ్యలా మారి, ఈ నాటి వరకూ పరిశోధకులకు అపరిష్కృత అంశంగా మిగిలిపోయిన వ్యక్తి అతను. పేదరికంలో, అజ్ఞానంలో పిల్లల్ని పెంచటం కంటే వారిని చంపటం మేలనేది ఇక్కడ కవి హృదయం. మతాధికారిగా ఉన్నత పదవి నిర్వహిస్తూ ఆ మతానికే వాతలు పెట్టడం, రచయితగా ఎవరూ అందుకోలేనంత ఎత్తైన శిఖరాలు అధిరోహించటం, వ్యక్తిగత జీవితం గురించి దాదాపు ఏ ఆనవాలు దొరక నీయకపోవడం ఆయన గారి ప్రత్యేకతలు. అతను ఎవరిని గురించయినా, దేనిని గురించయినా రాస్తే చెప్పుకు చందనం అద్ది మరీ కొట్టినట్టే! కొట్టాక, చెప్పుతో కొట్టాడా? చందనం రాశాడా అనేది తెలియని సందిగ్ధస్థితిలో నుంచి బాధితుడు తేరుకునే లోపు 'ఛళ్' మనే శబ్దం మరో చోట మార్మోగుతుంది. ప్రపంచ సాహిత్యంలో ఎన్నో విభిన్న ప్రక్రియలకు ఎందరో మకుటం లేని మహారాజులుగా చరిత్రకెక్కారు. అన్నిటిలోకి క్లిష్టమైంది, అతిత్వరలో అపార్థాలకు గురయ్యేదీ అయిన వ్యంగ్యానికి ఇంగ్లీషులోనే కాదు, మరే భాషలోనూ తనకు ముందు, వెనుకా సరిసాటిలేరని చాటింపు వేయించుకో గలిగిన సత్తా, స్థైర్యం కలవాడు జోనాథన్ స్విఫ్ట్. మతాచార్యుడు, రచయిత, జర్నలిస్టు, దేశభక్తుడు ప్రాక్టికల్ జోకర్, కవి, కాఫీగత ప్రాణి ఇలా ఎన్నో గుణాల మేళవింపు స్విఫ్ట్. మనుష్యుల్లోని కుత్సితం, డాంబికం, కపట వేషాలు అంటే అసహ్యించుకునే స్విఫ్ట్ 1667 నవంబరు 30న డబ్లిన్‌లో పుట్టాడు. తండ్రి జోనాథన్ స్విఫ్ట్ మన స్విఫ్ట్ ఈలోకంలోకి వచ్చేందుకు కొన్ని నెలల ముందే కన్నుమూశాడు. పెంచిన ఆయా అపహరించుకుపోయినా, చదువులో మూడో ఏటనే బైబిల్‌లో ఏ భాగాన్నయినా చదవగలిగాడు. ఆక్స్‌ఫర్డ్ కేంబ్రిడ్జిలలో చదవాలని కోరిక కానీ ఆర్థిక ఇబ్బందుల వల్ల డబ్లిన్‌లోనే విద్యాభ్యాసం చేశాడు.

స్విఫ్ట్ రచనలన్నీ దాదాపు మారు పేర్లతో చేశాడు. కనీసం ఆరు కలం పేర్లు వాడాడు. అవి ఐజక్ బికర్ స్టాఫ్, 'ఎ డిస్సెంటర్' ఏ పర్సన్ ఆఫ్ క్వాలిటీ ' ' పర్సన్ ఆఫ్ హానర్ ' ' ఎ.బి. డ్రేపియర్' డి.టి. ఆర్. జె. ఎస్.డి. ఓ.పి.పి. ఐ. ( ది రివరెండ్ డాక్టర్ జోనాథన్ స్విఫ్ట్, డీన్ ఆఫ్ పాట్రిక్స్ ఇన్ ఐర్లాండ్) ''జీవిత చరిత్ర అనే పక్రియలో అత్యంత క్లిష్టమైన అంశం స్విఫ్ట్ జీవితం. అతని రచనలు, డైరీలు అసంఖ్యాకం. స్విఫ్ట్ వ్యక్తిత్వం ఎంతో సంక్లిష్టం. అతని ఆలోచనలు, క్రియలు విపరీతంగా ఉంటాయి. అతని నిజమైన వ్యక్తిత్వం మనకు ఎక్కడా స్పష్టంగా అవగతం కాదు. దానితో ఎవరైనా అసమగ్రంగా' అసంపూర్తిగానే స్విఫ్ట్ జీవిత చరిత్రను రాయాల్సిందే'' అని ఎడ్వర్డ్ హెచ్. ' ఓ ' నీల్ ' ఏ హిస్టరీ ఆఫ్ అమెరికన్ బయోగ్రఫీ' లో అంటాడు.

ఆ నాటి ఇంగ్లండు స్థితిగతులతో పోలిస్తే స్విఫ్ట్ పనులు, రాతలు 'విపరీతం'గానే ఉంటాయి. ఎంత సంపన్నులయినా, లార్డు లయినా తనకు సమానగౌరవం ఇస్తేతప్ప వారిగడప తొక్కేవాడు కాదు. స్వయంగా వచ్చి విందుకు ఆహ్వానిస్తే తప్ప లేడీ యాష్ బర్న్ గుర్రబ్బగ్గీ పంపితే 'రాను' అని స్పష్టంగా చెప్పి పంపాడు. మానభంగం ఆరోపణ మీద పట్టు బడ్డ ముద్దాయిని విడుదల చేయించేందుకు చాలా పెద్ద తలకాయలు ఒకసారి పూనుకున్న సందర్భంలో స్విఫ్ట్ నిర్వహించిన 'బాధ్యత గల పౌరుడు' పాత్ర శ్లాఘనీయం. ఎట్టి పరిస్థితుల్లోను నిందితుణ్ని శిక్షించాల్సిందే అని అతని వాదన.'' అది, దాని ఇష్టప్రకారం అతనితో ఇంతకు ముందు ఓ వందసార్లు పడుకుంది, కాబట్టి ఇది బలాత్కారం కిందకు రాదు'' అంటూ అవతలి పక్షం వారు వితండ వాదం మొదలు పెట్టారు. ఇక్కడ స్విఫ్ట్ వారిని అడిగిన ప్రశ్న అతనిలో దాగి ఉండే మానవత్వాన్ని వివరిస్తుంది. '' ఒక స్త్రీ వేశ్య అయినంత మాత్రాన ఆమెను చెరిచి అవమానించాలా'' అని అడిగాడు. తర్వాత నిందితుడికి శిక్ష పడిందనుకోండి. ఆంగ్లకవి జాన్ డ్రైడన్ స్విఫ్ట్‌కు చుట్టం. ఒకసారి 'కవిత్వాన్ని నేను రాశాను. చూసి చె 'ప్పంటే సోదరా నువ్వు ఏనాటికీ కవివి కాలే వని కితాబిచ్చాడు డ్రైడన్. దానితో పట్టుదల పెరిగిన స్విఫ్ట్ ఎన్నో కవితలు, కావ్యాలు అత్యంత మనోహరంగా రాసి చూపించాడు ప్రపంచానికి. ఈ రోజుకీ ఆంగ్ల సాహిత్య విద్యార్థులకు సిలబస్‌లో స్విఫ్ట్ కవిత్వం తప్పని సరి అంశం. అయితే డ్రైడన్‌ను మాత్రం జీవితాంతం క్షమించలేక పోయాడు. జీవితంలో రెండే సార్లు నవ్వానని ఒక సారంటాడు. మొదటి సారి హెన్రీ ఫీల్డింగ్ రాసిన వ్యంగ్య నాటిక 'ది లైఫ్ అండ్ డెత్ ఆఫ్ టామ్‌థంబ్ ది గ్రేట్' చూస్తున్నప్పుడు. రెండోసారి ఎప్పుడు నవ్వాడో మనకు తెలియదు కానీ, తన రాతల వల్ల మింగలేక, కక్కలేకపోతున్న వాళ్ళను చూసి రోజూ ఒక్కడే పగలబడి నవ్వుకొని ఉంటాడు. కృత్రిమత్వాన్ని, కుత్సితాన్ని, గొప్పలు చెప్పుకుంటూ, తప్పులు దాచుకునే కొందరు 'స్థిత ప్రజ్ఞుల' యవ్వారాలను తీవ్రంగా విమర్శించేవాడు, విరుచుకు పడేవాడు. స్వేచ్ఛ 'మర్యాద,' మన్నన అణుకువలను అభిమానించి, ఆదరించేవాడు. మనిషన్నాక కనీసం 'కామన్ సెన్స్' ఉండాలని వాదించేవాడు.

' ఈ లోకాన్ని బాగు చేసేందుకు కాక, రెచ్చగొట్టేందుకు రాశానన్న అధిక్షేప నవల 'గలివర్ ట్రావెల్స్' ఆశ్చర్యకరంగా హాస్య, భాలసాహిత్యంగా మారిపోయింది. సర్ రాబర్ట్‌వాల్‌పోల్ ప్రభుత్వం మీద ఎక్కుపెట్టిన వ్యంగ్యాస్త్రాన్ని కాలక్షేపపు కబుర్లుగా చాలామంది పరిగణించారు. 'ట్రావెల్స్'ను మొత్తం బూతు, అశ్లీలం, అసహ్యం, అసభ్యం అంటాడు థాకరే. ఆ పుస్తకం చదివిన ఒక పాస్టరు గారు ఇందులో ఒక్క ముక్క కూడా నేను నమ్మను, అన్నీ అబద్ధాలు అన్నారని స్విఫ్ట్ ఒకచోట ఉదాహరిస్తాడు. గలివర్స్ ట్రావెల్స్ సాహిత్య ప్రపంచం మీద ఎంత ప్రభావం చూపిందో, ఎన్ని రూపాంతరాలు చె ంది, ఎంతమందికి అభిమాన గ్రంథమయ్యిందో తెలిసిన విషయమే. కందుకూరి విరేశలింగం పంతులు గారు స్వయంగా చెప్పినట్టు 'సత్యరాజా పూర్వదేశయాత్రలు' ట్రావెల్స్

ప్రేరణతో వెలువడిందే. ''సత్యరాజాపూర్వ దేశ యాత్రలు కాలక్రమం వల్ల కాకపోయినా, మన అధిక్షేప నవలా సాహిత్యంలో మొదట చెప్పుకోతగిందే అవుతుంది. తెలుగులో తర్వాత వచ్చిన అధిక్షేప నవల ఏదీ ఇంత రసవంతంగానూ, ఇంత వైవిధ్యంగల సాధనాలతోనూ లేదు (రెంటాల వెంకటేశ్వరరావు, భారతి, నవంబరు 1990.

స్విఫ్ట్ జీవితంలో ప్రాక్టికల్ జోకర్. ఆ రోజుల్లో పాట్రిడ్జ్ అనే సిద్ధాంతిగారు పంచాంగాలు తయారు చేసి ఫలానారోజు అరిష్టం, ఫలానా ఘడియ అశుభం, వర్జ్యం అంటూ తనకు తోచిన విధంగా ప్రజాసేవ చేస్తూండేవాడు. అంతఘాటు సేవానిరతిని తట్టుకోలేని స్విఫ్ట్, 'ఐజాన్ బికర్ స్టాఫ్' పేరుతో తనో పంచాగం తయారుచేసి ఫలానారోజు ఇన్నిగంటల, ఇన్ని నిమిషాలకు పాట్రిడ్జ్ కన్ను మూస్తాడని రాశాడు. ఆ రోజు వచ్చింది, పోయింది. ఒక రెవెన్యూ అధికారి తన పై ఉద్యోగికి పాట్రిడ్జ్ కన్ను మూసిన విధం, అతని అంతిమ ఘడియలు వివరంగా నివేదిక రూపంలో పంపినట్టు సంపాదకుని లేఖల శీర్షికలో ప్రచురించాడు. పాట్రిడ్జ్‌ను సమాధి చేయటానికి ఒకపక్క ఏర్పాట్లు జరుగుతూ, అతని స్నేహితులు విచిత్రంగా చూస్తూ, ''అచ్చం నీలాంటి స్నేహితుడు ఉండేవాడు. ఈ మధ్యేపోయాడు'' అంటున్నారు. మరోపక్క పాట్రిడ్జ్ భార్యకు పాపం! భర్తపోయాడు అని సానుభూతి చూపడం మొదలుపెట్టారు. అతని పంచాగం అచ్చేసే ప్రచురణ కర్తలు పాట్రిడ్జ్ పంచాగం అని ఎవరొచ్చినా వారి మీద చట్టపరమైన చర్యలు తీసుకోవాలంటూ తీర్మానించుకుని, వారి జాబితాలో నుంచి అతని పేరు కొట్టేశారు. రాసిన వన్నీ జరుగుతున్నాయంటే తప్పనిసరిగా క్షుద్రశక్తుల సహకారం ఉండితీరాలని బికర్ స్టాఫ్ రచనలను పోర్చుగల్ దేశంలో నిషేధించారు. ఈ గోల, ఆందోళన భరించలేక తన మాటలు ఎవరూ వినక, తన రాతలు ఎవరూ ప్రచురించక పోయేసరికి, ''నేను బతికీ ఉన్నానో హోయ్'' అంటూ పాట్రిడ్జ్ ఒక కరపత్రం విడుదల చేసుకోవాల్సి వచ్చింది. బతికి ఉన్నవాడెవడూ, నేను జీవించే ఉన్నానంటూ చెప్పుకోడు, రాసుకోడని, 'ఏ విండికేషన్ ఆఫ్ ఐజక్ బికర్ స్టాఫ్' అనే పుస్తకం రాశాడు స్విఫ్ట్. దానితో పాట్రిడ్జ్ రచనలను ఆరేళ్ళపాటు బహిష్కరించారు. స్విఫ్ట్‌కు మతంలో, క్రైస్తవంలోని 'త్రిత్వం' లో పరిపూర్ణ విశ్వాసం. అయితే మతం, నమ్మకం పేరు మీద జరిగే 'అతి' ని ఖండఖండాలు చేసేవాడు.

ఐర్లాండుకు గుర్తింపు తీసుకురావటంలో, ఐరిష్ ప్రభావాన్ని ప్రపంచానికి తెలియ చేయడంలో స్విఫ్ట్ పాత్ర ఆ దేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించారు. 'పాలితుల అంగీకారం లేని ప్రభుత్వం బానిసత్వం కన్నా మరేమీ కాదని 'డ్రేపియర్ లెటర్స్' లో అంటాడు. లెటర్స్‌లోని అభ్యంతర కరమైన రాతలకు స్విఫ్ట్ మీద చట్టప్రకారం చర్యతీసుకోవాలని ప్రభుత్వం వారు భావించినా కుదరలేదు. అతన్ని అదుపులోకి తీసుకోవాలంటే కనీసం పదివేల మంది సైన్యం కావాలని బ్రిటిష్ ప్రధాని వాల్‌పోల్ అంటాడు. ఐర్లాండులో స్విఫ్ట్ ప్రఖ్యాతిని వివరించే చిన్న ఉదాహరణ: సూర్యగ్రహణాన్ని చూసేందుకు జనమంతా ఒకచోట చేరారు. స్విఫ్ట్‌గారు గ్రహణాన్ని వాయిదా

వేశా రనగానే జనం మారుమాట్లాడకుండా ఇళ్ళు ముఖం పట్టారు. ఏ దేశమయినా సుభిక్షంగా ఉండాలంటే మొదట వ్యవసాయంలో స్వయం సమృద్ధి సాధించాలని కోరుకున్నా స్విఫ్ట్ రాతలకు భయపడి ఆంగ్ల ప్రభుత్వం తను ప్రతిపాదించిన నూతన నాణేల విధానాన్ని, జాతీయ బ్యాంకు విధానాన్ని ఉపసంహరించుకుంది. ఇంగ్లాండు మీద అతని రాతలు ఆ నాటి ఏలికలకు చెప్పులో రాయి, చెవిలో జోరీగ, కంటిలో నలుసు, కాలిముల్లు, పక్కలో బల్లెం అయ్యాయి. ఐరిష్ వారి బాధలు తీరి, ఇంగ్లీషువారి ఆకలి చల్లారాలంటే వీరు పిల్లల్ని డబ్బుల కోసం వారికి అమ్ముకోమంటాడు. ఇంగ్లాండు అనే మగాడు ఐర్లాండ్ అనేస్త్రీని చెరిచి, శీలం దోచుకుని, స్కాట్లాండ్ అనే వేరే స్త్రీని పెళ్ళాడ బోతు న్నాడని ఒకసారి రాస్తాడు. చట్టం అనేసాలెగూడులో చిన్న పురుగులు దొరుకుతాయి కానీ, పెద్ద కీటకాలు తప్పించుకుంటూనే ఉంటాయని, అనిశ్చితత్వం తప్ప నిశ్చితమైంది ఈలోకంలో ఏదీలేదంటాడు. ఒకరినొకరు ద్వేషించుకునేందుకు సరిపోయినంత మత ముంది గానీ, పరస్పరం ప్రేమించుకునేందుకు మాత్రం కాదంటాడు. ఇవ్వాళ కూడా ఆ మాటలు ఎంత నిజం!? మనుష్యులు క్రూరంగా, మోసంతో బతకటం చూస్తే నాకు ఏమీ అనిపించదు గానీ, అయితే అలా బతుకుతున్నందుకు వారు సిగ్గు పడక పోవటం చూసి ఆశ్చర్యపోతానంటాడు.

ఐర్లాండ్ అభ్యున్నతి కోసం స్విఫ్ట్ చల్లిన విత్తనాలు వృథా కాలేదు. ఈ నాటికీ అక్కడ జరుగుతున్న పోరాటాలు, వ్యత్యాసాలన్నీ ఆ నాటి కొనసాగింపులే. ఇదే విషయం మనం డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ రచించిన కులనిర్మూలనలో కూడా చూడొచ్చు. డాక్టర్ అంబేద్కర్ అందులో మరొకరి చేత పాలించుకోవాలంటే ఐరిష్‌వారికి ఎంత కంపరమో వివరిస్తారు ఒక సందర్భంలో

స్విఫ్ట్ తన యాభయ్యో ఏట ఎడ్వర్డ్ యంగ్ అనే కవికి పక్కనే ఉన్న ఎండిపోతున్న చెట్టును చూపించి ''నేను కూడా అలాగే పై నుంచి మరణిస్తా''నన్నాడు. అదే విధంగా వృద్ధాప్యంలో భయంకరమైన శ్రవణేంద్రియ వ్యాధితో, కోడిగుడ్డంతగా పెరిగిపోయిన కంటితో, మానసిక దర్బలత్వంతో నరకయాతన అనుభవించాడు. జీవితం మీద ఆశ వదులుకున్న స్విఫ్ట్ రోజూ 'రేపు మిమ్మల్ని చూడ లేనేమో' అంటూ వీడ్కోలు చెప్పేవాడు. ఆ దశలో ఉన్న స్విఫ్ట్‌ను అతని తీవ్ర విమర్శకుడయిన విలియం మెక్‌పీస్ థాకరే 'పతనావస్థలో ఉన్న మహాసామ్రాజ్యంతో పోల్చాడు. ఆరోగ్యం కుదుటపడుతుందేమోనన్న కోరికతో రోజుకు 38మైళ్ళు నడవటం, రకరకాల మందులు వాడటం వంటి ప్రయోగాలు చేసి చూశాడు. చివరి మూడు సంవత్సరాలు మనిషితోడు లేకుండా ఏ పని చేసుకోలేకపోయి, అదే విధంగా కన్నుమూశాడు.

రచయితగా స్విఫ్ట్ మీద జడివానలాగా పొగడ్తలు కురిపించి అమితదాతృత్వం ప్రదర్శించినవారు, అతను ఇర్లాండ్‌కు చేసిన సేవ విషయంలో మాటలకు మహాలోభులవటం. విగ్, టోరీలు,

ఇంగ్లాండు, ఐర్లాండ్‌ల మధ్య నిలువునా చీలుపోయిన చరిత్రకారులు, సాహితీ విమర్శకులు, వారి రాతల్లో ఆ యా వ్యత్యాసాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. మన దేశానికి చెందిన బహుగ్రంథ కర్త, విమర్శకుడూ అయిన ఆర్.డి. త్రివేది కయితే స్విఫ్ట్ ప్రతి రాతలోనూ, మాటలోనూ మతి చాపల్యమే కనిపిస్తుంది. (కంపెండియస్ హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ లిటరేచర్-1976). ఎందరో సాహితీ రాజకీయ ప్రముఖులు స్నేహితులయిన స్విఫ్ట్ అంతరంగంలో ఏకాకిగా మిగిలిపోయాడు. 'స్టెల్లా, 'వనిస్సా' లతో అతని కి ఉన్నాయంటున్న సంబంధాలు, అతన్ని మిస్ యాంత్రోఫ్'గా అభివర్ణించే రచనలు కూడా తక్కువేమీ కాదు. ''అతని ప్రభావం కార్లయిల్, రస్కిన్ లాంటివారి మీద ఉంది. అయితే వ్యంగ్య వైభవంలో స్విఫ్ట్‌కు ఆంగ్లంలోనే కాదు, ఏ భాషలోనూ సరిజోడిలే' రన్న షేర్విన్‌కాడీ (సెలెక్షన్ ఫ్రం ది బెస్ట్ ఇంగ్లీష్ ఎస్సేస్ - 1903) మాటలు అక్షర సత్యాలు. అంచనాల విషయంలో అతివృష్టి అనావృష్టికి గురయిన స్విఫ్ట్ మనీష అనేక మంది దృక్పథాల నుంచి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, మానసిక, మత సాహిత్యనేపథ్యాల నుంచి పరిశీలించి పరిశోధించి, అధ్యయనం చేయాలసిన 'దృగ్విషయం' ఆనాడే ఆంగ్ల వస్తు బహిష్కరణకు పిలుపునిచ్చి, ఆంగ్లేయ సామ్రాజ్యవాద, వలసవాద విధానంలోని అవకతవకలను ఎండ గట్టిన స్విఫ్ట్ జీవిత చరిత్రను సర్ వాల్టర్ స్కాట్ వంటి మహా రచయిత 19 భాగాలుగా రచించాడు. స్కాట్ తన గ్రంథంలో యథాతథంగా దించేసిన జాన్‌విల్సన్ క్రోకర్ అనే రచయిత చేసిన వర్ణనతో ఈ వ్యాసాన్ని ముగిస్తాను ''అంధకారంలో ప్రకాశవంతమైన 'తార' ఒకటి ప్రభవించింది. పర్షియాలో విగ్రహారాధన చేసినట్టుగా ఐర్లాండ్ ఆ 'తార'ను ఆరాధించింది. ఐర్లాండుకు అతనే మొదటి, చివరి నిజమైన దేశభక్తుడు ... సందేహాల కతీతంగా అతన్ని విశ్వసించారు. అసూయకుకు తావులేకుండా అతన్ని ప్రేమించారు. ప్రత్యర్థి అనేవాడు లేకుండా అతనికి విధేయు లయ్యారు. అతని మేధస్సు కార్యాచరణకు అనువుగా, ప్రవక్తసూక్తుల్లా ఉండి వర్తమానానికి విరుగుడుగా, భవిష్యత్తుకు హెచ్చరికగా ఉంటుంది. ప్రప్రథమంగా అతను ఐర్లాండును ఒక జాతి కమ్మని, ఇంగ్లాండుకు నియంతృత్వం మానమని బోధించాడు. అయితే అతను ఓ మతాచార్యుడు. అతని అంగీ స్విఫ్ట్‌ను అడ్డగించింది. అతని ప్రయత్నాలకు గుదిబండగా పరిణమించింది. చట్ట సభలకు గానీ సైన్యానకి గానీ సాయం చేయటంలో అతను క్రామ్‌వెల్‌ను మించిపోయాడు. ఇంగ్లాండు కన్నా ఐర్లాండు తక్కువా కాదు. ఐర్లాండ్‌ను అతను తన ధైర్య సాహసాలతో సంరక్షించాడు. తన ఆధిపత్యంతో మెరుగుపర్చాడు. తన ప్రతిభతో అలంకరించాడు. తన కీర్తి ప్రతిష్ఠలతో ఉన్నత స్థాయికి చేర్చాడు. అతని ఉద్యమం సాగింది పదేళ్ళు. దశాబ్ద కాలం పాటు తన వ్యక్తిగత శక్తితో ప్రభుత్వాన్ని ముప్పుతిప్పలు పెట్టాడు. గొప్పవారు అనిపించుకునే ఎవరికీ అతను భయపడలేదు. మేధావులు అతన్ని ఎన్నడూ మర్చిపోలేదు. అతని రచనల్లాగే, స్విఫ్ట్ ప్రభావం శతాబ్దం పైనే వుంది. ఈ నాడు మనకు ఏ మాత్రమయినా సుభిక్షత ఉంటే, దాని పునాదులు, నిస్వార్థపరుడు, అపురూప దేశభక్తుడు అయిన జోనాథన్ స్విఫ్ట్ కాలంలోనే పడ్డాయి.

S. 1053

To,
Dr. B. Rama Raju
1-8-117/3
Chikkadapalli
Hyderabad.

*Dear Sir,*

Sub. : Reminder for renuwal of your subscription - Reg.

This is to bring to your kind Notice that your subscription expires from ..April...1996......We request you kindly revew your subscription. Subscription per Annuam is **Rs. 70/-**

thanking you,

Yours faithfully
for **MISIMI.**

*Circulation Manager.*

1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. 'X' Roads,
Musheerabad, Hyderabad 500 020. A.P.

**Editorial NEST**
B-15, Journalist Colony, Jubilee Hills, Hyderabad-500 034. Phone: 247717

భారత కథలలో అసంగతాలు :

# కీచకవధ - ఒకపరిశీలన

- కె. ఎమ్. వి. జి. కృష్ణమూర్తి

భారత కథలలోనే కాక, మన పురాణకథలలో చాలా వాటిని నిశితంగా పరిశీలిస్తే చాలా అసంగతాలు కనపడతాయి. అవి కథాపరమైనవి కొన్ని, వ్యక్తుల ప్రవర్తనా పరమైనవి, దేశకాలపరమైనవి మరి కొన్నీను. కీచకవధలోని అసంగతాలను పరిశీలిద్దాం.

కీచకవధ విరాటపర్వం ద్వితీయ, తృతీయాశ్వాసాలలో వర్ణించబడింది. కీచకుడు తనను వేధిస్తున్నాడని ద్రౌపది భీమునితో రహస్యంగా మొరపెట్టుకుంటుంది. నాట్య మందిరంలో రహస్యంగా కీచకుడిని చంపేందుకు పన్నాగం పన్ని, ద్రౌపది కీచకుణ్ణి అర్ధరాత్రి అక్కడకు రమ్మంటుంది. రహస్యంగా పొంచి ఉన్న భీముడు కీచకుణ్ణి గుట్టు చప్పుడు కాకుండా చంపి తన వంటశాలకు వెళ్ళిపోతాడు. ఆ తరువాత సైరంధ్రి 'కావలి వారలం బిలిచి నాపతులు గంధర్వులచే పడి మృతి బొందె వీడె'' అని చూపెడుతుంది.

''ఉన్నంత బంధు జనంబులు గూడంబారి కీచక శవంబు కనుంగొని.'' ఆ తరువాత కీచకుని సోదరులైన నూట ఐదుగురు ఉపకీచకులు అన్నకు అగ్నిసంస్కారం చేయడానికి ఉపక్రమిస్తారు. ( ఇది చాలా వింత కాదా? వెంటనే అగ్ని సంస్కారం - అందునా జశ్యాలకుడికి)

''ఈ కీచకుణ్ణి రహస్యంగా చంపించిన ద్రౌపది అక్కడ నుంచి వెళ్లకుండా వీరి చందముల్ చూతముగాక యంచు నొక చేరువ'' నుంటుంది. ( ఇదీ వింతగానే ఉంది. హత్య చేసిన భీమునికి లేని కుతూహలం ద్రౌపదికి ఎందుకు వచ్చింది? )

అప్పుడు ఉపకీచకులు ద్రౌపదిని కూడా కీచకుడి పాడెకు కట్టి అగ్ని సంస్కారం చెయ్యడానికి ఉపక్రమిస్తారు. (అర్ధ రాత్రి వేళ విరాటుణ్ణి లేపి అందుకు అనుమతి కోరుతారు. విరాటుడు. నేను వద్దంటే మాత్రం మానుతారా 'మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి' అంటాడు).

అప్పుడు ''నయ్యతివ భయభ్రాంత చిత్తయై బాష్పజలోద్గతి మొగము గప్పగ నిట్టని యతిరావముగా నొనర్చి నాక్రందనమున్''

ఇది ఎంతో దూరంలో వంటశాలలో నిద్ర కుపక్రమిస్తున్న భీముడు వింటాడు. వెంటనే రహస్యంగా ముందే శ్మశానం చేరుకుని, ఒక చెట్టు పెకలించి ఉపకీచకులు నూట యేవురు మందిని చంపేస్తాడు. తరువాత రహస్యంగా తన వంటశాలకు వచ్చేస్తాడు. తెల్లవారాక ద్రౌపది సచేలస్నానం చేసి ''మంద యానంబున పురంబున సొచ్చి రాజవీథి నరుగుందెమునప్పుడు'' నగర ప్రజలు భయోద్వేగాలతో ఆమెను తిలకిస్తారు.

తే. 'నాథులార! గంధర్వ రత్నంబులార
నన్ను నుపకీచకులు దమ యన్న శవము
నందు! బంధించుకొనివెస నరుగుచున్న
వారు రక్షింపవేగ రావలయు మీరు!

